# భక్తి ప్రసూనాలు




## కృష్ణ ప్రసాద్

# భక్తి ప్రసూనాలు




## కృష్ణ ప్రసాద్

# భక్తి ప్రసూనాలు

ప్రథమ ముద్రణ : నవంబరు, 2002

ప్రతులు : 500

వెల : రు. 30/-

ముఖచిత్రం : శ్రీమతి జొన్నలగడ్డ రాజ్యలక్ష్మి

ప్రతులకు : జె.ఎస్.ఆర్.కె. ప్రసాద్, ఎమ్. ఎస్. సి.

15-25/2, శ్రీ కోదండరామ నగర్,

దిల్‌సుక్ నగర్, హైదరాబాద్ - 500060

ఫోన్ : 4061241

ముద్రణ:

విజయలక్ష్మి ప్రింటర్స్ ,

దిల్‌సుక్ నగర్, హైదరాబాద్.

ఫోన్ : 4064561

అంకితం:

సర్వేశ్వరుని పాదపద్మములకు -

"కవి కౌస్తుభ"
డా. ఆచార్య తిరుమల
301, నందిని కాంప్లెక్స్
మొజంజాహి మార్కెట్
హైదరాబాద్ - 95.

# 'హరి' చందనం

చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలపడేని
కలుగ నేటికి తల్లుల కడుపు చేటు!!

అన్నాడు పరమభక్త శిఖామణియైన పోతన. ఈ పద్యంలో "నోరు నొవ్వంగ" అనే ప్రయోగాన్ని గమనించాలి. నోరు నెప్పి పెట్టేలా భగవద్ధ్యానం చేయమని ఆదేశం. అలా భజించి, తరించిన భక్త చరిత్ర మనకు చాలా వుంది.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్!!

అనేవి నవ విధ భక్తి సూత్రాలు. శ్రవణంతో పరీక్షిత్తు, కీర్తనతో నారదుడు, స్మరణంతో ప్రహ్లాదుడు, పాదసేవనంతో రుక్మిణి, అర్చనతో అంబరీషుడు, వందనంతో అక్రూరుడు, దాస్యంతో ఆంజనేయుడు, సఖ్యంతో అర్జునుడు, ఆత్మ నివేదనతో భీష్మ విదురాదులు భగవదనుగ్రహాన్ని పొందారు. ఆ మార్గాలే అందరికీ ఆదర్శం కావాలి. భగవద్ధర్మాన్ని ధరించటమే భక్తి.

"ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారా వాహిక గతాతౌ
సర్వేశే మనసో వృత్తి ర్భక్తి రిత్యభిధీయతే!! "

అంటారు 'ఉజ్వల నీలమణి' కర్త. జ్ఞాన, కర్మ రంగాల్లో పరిపూర్ణత సాధించటం కష్టం కాబట్టి మన పెద్దలు ఈ భక్తి మార్గాన్ని మధ్యేమార్గంగా నిర్దేశించారు. ఇందులోనూ రాణించలేని వారి జన్మ వ్యర్థం. ఎందుకంటే :-

జంతూనాం నర జన్మ దుర్లభతరం పుంస్త్వం తతో విప్రతా
తస్మాద్ వైదిక ధర్మ మార్గ పరతా విద్వత్త్వమస్మాత్పరం
ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి
ర్ముక్తిర్నో శతకోటి జన్మ సుకృతై : పుణ్యైర్వినా లభ్యతే !!

శతకోటి జన్మల పుణ్యఫలం వల్ల గానీ మానవ జన్మలో ఆత్మజ్ఞానం కల్గదు. అది గుర్తించని వారిని దృష్టిలో పెట్టుకొనే పోతన "కలుగనేటికి తల్లుల కడుపు చేటు" అన్నాడు.

పైన ఉదహరించిన శ్లోకార్థం పరిపూర్ణంగా వర్తించే కృష్ణప్రసాద్ భక్తి రంగంలో త్రికరణ శుద్ధిగా రాణిస్తూ, పరిణతిని సాధిస్తున్నాడు. ఇది అతని గేయాత్మక భక్తి ప్రసూన మంజరి. ఇందులో శివకేశవుల్ని గురించి, రామ కృష్ణుల్ని గురించి, వినాయక సాయినాథుల్ని గురించి, ఆంజనేయ వేంకటేశుల గురించి ప్రార్థనలున్నాయి. అన్నిటా ఒక పరవశం, ఒక పరిమళం ఉన్నాయి. చిన్న చిన్న మార్పులు చేసుకుంటే పాటలుగా కూడా బాగా పనికివస్తాయి.

శివప్రసాద్ యీ ప్రసూనాల్ని నిర్మల బుద్ధితోనే అందిస్తున్నాడు. వినాయకుణ్ణి ఆది దంపతుల ఆంతర్యమెరిగిన వాడవంటున్నాడు. "ఈశ్వరా ! అమలేశ్వరా !" అంటూ ఎలుగెత్తి శివుణ్ణి "అద్వైత రూపా ! అభయంకరా !" అని శివాద్వైత సిద్ధిని చాటుతూ శవాన్ని గూడా శివం అంటున్నాడు. శ్రీరామ భజనలో పరవశిస్తూ, రామ నామాన్ని జపిస్తూ, రామపాదాన్ని సేవిస్తూ, వాల్మీకి రామాయణాన్ని పునశ్చరణ చేసుకుంటున్నాడు. పైగా త్యాగరాజులా రాముణ్ణి "రావయ్యా! నా యింటికి" ఆహ్వానిస్తున్నాడు. అలాగే, కృష్ణుణ్ణి తన పాలి దైవంగా కొలిచాడు. సప్త శిఖరావాసుణ్ణే మోక్షశిఖరాన్ని అను గ్రహించమంటాడు. సాయి ధ్యానంలో పునీతమై "సాయిరావా ! సాయం రావా!" అంటూ వేడుకుంటాడు. దత్త హృదయాన్ని ప్రస్తావిస్తాడు. సుందర నాయకుడైన ఆంజనేయుని స్తుతిస్తూ చివరకు 'రామాయణమే నీవు' అంటాడు.

రామాయణంలో సుందరకాండకు అధిదేవత ఆంజనేయుడు.

"కవి కౌస్తుభ"
డా. ఆచార్య తిరుమల
301, నందిని కాంప్లెక్స్
మొజంజాహి మార్కెట్
హైదరాబాద్ - 95.

# 'హరి' చందనం

చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలపడేని
కలుగ నేటికి తల్లుల కడుపు చేటు!!

అన్నాడు పరమభక్త శిఖామణియైన పోతన. ఈ పద్యంలో "నోరు నొవ్వంగ" అనే ప్రయోగాన్ని గమనించాలి. నోరు నెప్పి పెట్టేలా భగవద్ధ్యానం చేయమని ఆదేశం. అలా భజించి, తరించిన భక్త చరిత్ర మనకు చాలా వుంది.

శ్రవణం కీర్తనం విష్ణో : స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్!!

అనేవి నవ విధ భక్తి సూత్రాలు. శ్రవణంతో పరీక్షిత్తు, కీర్తనతో నారదుడు, స్మరణంతో ప్రహ్లాదుడు, పాదసేవనంతో రుక్మిణి, అర్చనతో అంబరీషుడు, వందనంతో అక్రూరుడు, దాస్యంతో ఆంజనేయుడు, సఖ్యంతో అర్జునుడు, ఆత్మ నివేదనతో భీష్మ విదురాదులు భగవదనుగ్రహాన్ని పొందారు. ఆ మార్గాలే అందరికీ ఆదర్శం కావాలి. భగవద్ధర్మాన్ని ధరించటమే భక్తి.

"ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారా వాహిక గతాతా
సర్వేశే మనసో వృత్తి ర్భక్తి రిత్యభిధీయతే!! "

అంటారు 'ఉజ్వల నీలమణి' కర్త. జ్ఞాన, కర్మ రంగాల్లో పరిపూర్ణత సాధించటం కష్టం కాబట్టి మన పెద్దలు ఈ భక్తి మార్గాన్ని మధ్యేమార్గంగా నిర్దేశించారు. ఇందులోనూ రాణించలేని వారి జన్మ వ్యర్థం. ఎందుకంటె -

జంతూనాం నర జన్మ దుర్లభతరం పుంస్త్వం తతో విప్రతా
తస్మాద్ వైదిక ధర్మ మార్గ పరతా విద్వత్త్వమస్మాత్పరం
ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి
ర్ముక్తిర్నో శతకోటి జన్మ సుకృతై : పుణ్యైర్వినా లభ్యతే !!

శతకోటి జన్మల పుణ్యఫలం వల్ల గానీ మానవ జన్మలో ఆత్మజ్ఞానం కల్గదు. అది గుర్తించని వారిని దృష్టిలో పెట్టుకొనే పోతన "కలుగనేటికి తల్లుల కడుపు చేటు" అన్నాడు.

పైన ఉదహరించిన శ్లోకార్థం పరిపూర్ణంగా వర్తించే కృష్ణప్రసాద్ భక్తి రంగంలో త్రికరణ శుద్ధిగా రాణిస్తూ, పరిణతిని సాధిస్తున్నాడు. ఇది ఆతని గేయాత్మక భక్తి ప్రసూన మంజరి. ఇందులో శివకేశవుల్ని గురించి, రామ కృష్ణుల్ని గురించి, వినాయక సాయినాథుల్ని గురించి, ఆంజనేయ వేంకటేశుల గురించి ప్రార్థనలున్నాయి. అన్నిటా ఒక పరవశం, ఒక పరిమళం ఉన్నాయి. చిన్ని చిన్ని మార్పులు చేసుకుంటే పాటలుగా కూడా బాగా పనికివస్తాయి.

శివప్రసాద్ యీ ప్రసూనాల్ని నిర్మల బుద్ధితోనే అందిస్తున్నాడు. వినాయకుణ్ని ఆది దంపతుల అంతర్యమెరిగిన వాడవంటున్నాడు. "ఈశ్వరా ! అమలేశ్వరా !" అంటూ ఎలుగెత్తి శివుణ్ని "అద్వైత రూపా ! అభయంకరా !" అని శివాద్వైత సిద్ధిని చాటుతూ శవాన్ని గూడా శివం అంటున్నాడు. శ్రీరామ భజనలో పరవశిస్తూ, రామ నామాన్ని జపిస్తూ, రామపాదాన్ని సేవిస్తూ, వాల్మీకి రామాయణాన్ని పునశ్చరణ చేసు కుంటున్నాడు. పైగా త్యాగరాజులా రాముణ్ని "రావయ్యా! నా యింటికి" ఆహ్వానిస్తున్నాడు. అలాగే, కృష్ణుణ్ని తన పాలి దైవంగా కొలిచాడు సప్త శిఖరావాసుణ్ని మోక్షశిఖరాన్ని అను గ్రహించమంటాడు. సాయి ధ్యానంలో పునీతమై "సాయిరావా ! సాయం రావా!" అంటూ వేడుకుంటాడు. దత్త హృదయాన్ని ప్రస్తావిస్తాడు. సుందర నాయకుడైన ఆంజనేయుని స్తుతిస్తూ చివరకు 'రామాయణమే నీవు' అంటాడు.

రామాయణంలో సుందరకాండకు అధిదేవత ఆంజనేయుడు.

ఆయన అసలు పేరు సుందరుడు. సుందరకాండలో బాహ్యాభ్యంతర సౌందర్య వర్ణన వుంది. "అన్య సుందర కాండస్య సమంత్రం సవిద్యతే" దీని రహస్యాన్ని ఆది శంకరులు తమ సౌందర్యలహరి కావ్యంలో నిక్షేపించారు. దీని సారమైన ఆంజనేయుని - అందుకే

ఉద్య దాదిత్య సంకాశ ముదార భుజ విక్రమం
కందర్ప కోటి లావణ్యం సర్వ విద్యా విశారదమ్!!

అంటూ స్తుతిస్తారు. ఆత్మకు గల ఆరు ఆవరణల్లో అంజనం ఒకటి. ఇది వాయు నిబద్ధం కాబట్టి తద్గత శక్తి వాయుసుతుడైన ఆంజనేయుడయ్యాడు. శ్రీరాముడు ఆత్మ స్థానీయుడు. "రమయ తీతి రామః", "రమంతే యోగినో అస్మిన్నితి రామః". యస్మిన్ రమంతే మునయో విద్యయా జ్ఞాన విప్లవే తం గురుః ప్రాహాం రామేతి రమణా ద్రామః ఇత్యపి" - యోగి మానస గమ్యుడు రాముడు. కేవలం నామ జపం చాలదు. దాని వెనుకనున్న తత్త్వ జ్ఞానాన్ని అర్థం చేసుకున్నప్పుడే అది భక్తి అవుతుంది. జ్ఞాన భక్తి తప్ప మూఢ భక్తి, మూర్ఖ భక్తి ఉండవు. భగవంతుడు అంతర్యామి." క్షీరే సర్పిః తిలే తైలం పుష్పేగంధః ఫలే రసః కాష్ఠే అగ్నిః" - పాలలో వెన్నలా, తిలలో తైలంలా, పువ్వులో వాసనలా, పండులో రసంలా, కట్టెలో అగ్నిలా ఉన్నాడు. మథించి సాధించాలి. దానికి ఇటువంటి ప్రసూనాల గంధ పరిమళాలు చాలా కావాలి. వాసన సంస్కారమై భక్తి నిత్యం కావాలి. 'భక్తి' అనేది అశక్తతతో పుట్టిన నటన కాదు, ఇరుగు పొరుగు వాళ్ల కోసం చేసే ప్రదర్శనం కాదు. అది జ్ఞానం, అది సత్యం, అది అనంతం. కృష్ణప్రసాద్ భక్తుడు.

నమో భక్త ప్రణస్యతి!

హైదరాబాదు - 95
28 - 11 - 2002

ఆచార్య తిరుమల.

# మాతృ దేవోభవ! పితృ దేవోభవ!

## కృతజ్ఞతా ప్రసూనాలు

శిష్య వాత్సల్యంతో తమ చల్లని ఆశీస్సులను 'హరి' చందనం

రూపంలోనాపై అనుగ్రహించిన గురువులు

'భారత్ 'భాషా భూషణ్' డా. ఆచార్యతిరుమలగారికి -

ముఖచిత్ర కారిణి నా శ్రీమతి జె. రాజ్యలక్ష్మికి -

పుస్తకముద్రణ చేసిన శ్రీ టి. విజయగోపాల్

(విజయలక్ష్మీ ప్రింటర్స్) గారికి -

అన్ని విధాల సహకరించిన సహృదయులందరికి -

భవదీయు,

కృష్ణ ప్రసాద్.

# నా రచనలు

| | | |
|---|---|---|
| 1. | అశ్రుఝరి (కవితా సంపుటి) | - 1992 |
| 2. | అల (కవితా సంపుటి) | - 1993 |
| 3. | వ్యాస ప్రసాదం | - 1994 |
| 4. | కాంతిబంధం (కవితా సంపుటి) | - 1995 |
| 5. | లక్షణ దీపిక | - 1996 |
| 6. | శ్రీ సాయి కిరణాలు | - 1996 |
| 7. | ఆరిపోని చేవ్రాలు (కవితా సంపుటి) | - 1996 |
| 8. | భగవద్గీతాను శీలన | - 1997 |
| 9. | మైత్రీసౌందర్యము | - 1997 |
| 10. | వేదమాత గాయత్రి | - 1998 |
| 11. | శివదర్శిని | - 1998 |
| 12. | ఇంకా ఏదో కావాలి (కవితా సంపుటి) | - 1999 |
| 13. | శ్రీ సాయి దశకం | - 2000 |
| 14. | శ్రీ లలితానామ సహస్రార్థము | - 2000 |
| 15. | శ్రీ రామ దర్శిని | - 2001 |
| 16. | హృదయ బిందువులు (కవితా సంపుటి) | - 2001 |
| 17. | భక్తిమార్గము | - 2002 |
| 18. | శ్రీ కృష్ణదర్శిని | - 2002 |
| 19. | భక్తిమాల | - 2002 |
| 20. | శ్రీ రామ గీతోపదేశము | - 2002 |
| 21. | భక్తి ప్రసూనాలు | - 2002 |
| 22. | Youth (ఇంగ్లీషు) - ముద్రణ కావలసినది | |

## 1. శ్రీ వినాయక స్తుతి

జయజయనాయక జయ వినాయక

జయజయనాయక జయ గణనాయక

ఓ బొజ్జగణపయ్య! మా పాలిదైవమయ్య

ఉండ్రాళ్లకే కరుణిస్తావయ్యా

మూషికవాహనా గజాననా

లంబోదరా నిను వర్ణింపతరమే

శివపార్వతుల అర్ధనారీశ్వర

ఆత్మసంభవమే నీవయ్యా!

ఆది దంపతుల అంతర్యమెరిగి

పూజించినావయ్యా

గణాధ్యక్షుడవైనావయ్యా!

జగన్నాయకా అనంతనాయకా! గైకొనుమా

నా అనంత నతులు నుతులు.

## 2. కరణౌ చరణౌ శివం

| | |
|---|---|
| ప్రతి చరణం | శివం |
| ప్రతి కరణం | శివం |
| ప్రతి కణం | శివం |
| ప్రతి క్షణం | శివం |

| | |
|---|---|
| ప్రతి జీవం | శివం |
| ప్రతి స్మరణం | శివం |
| ప్రతి కార్యం | శివం |
| ప్రతి యోగం | శివం |
| ప్రతి లాస్యం | శివం |
| ప్రతి నటనం | శివం |
| ప్రతి ఘటనం | శివం |
| ప్రతి నర్తనం | శివం |
| ప్రతి సత్యం | శివం |
| ప్రతి సుందరం | శివం |
| ప్రతి మానసం | శివం |
| ప్రతి శవం | శివం |
| త్రికరణం | శివం |
| సమస్తం | శివం |

3. పాదము, పాదుక, పదము, పదరజము

| | |
|---|---|
| నడిపించునది | పాదము |
| పూజింపబడునది | పాదుక |
| పలుకునది | పదము |
| శిరోధార్యమైనది | పదరజము |

మహనీయుల పాలిట పూజనీయాలు

4. ఈశ్వరా! అమలేశ్వరా!

నీ పదమే తెలియగ
నా జన్మమే సుకృతమాయె
నీ పాదమే కనుగొన
నా జన్మమే సఫలమాయె
నా తపనే సర్వముకాగ
నా జన్మము పావనమాయె
నీ పదమే పాదకమలమాయె
నా హృదయమే హృదయకమలమాయె
అమల అర్చనా కుసుమమాయె
నా జన్మమే ధన్యమాయె
ఈశ్వరా! అమలేశ్వరా!

5. సత్య శివ సుందరా!

పూలతో పూజింతునన్న
నీ పాదములే కమలములాయె
అభిషేకింతునన్న
గంగనే జటాజూట మందు బంధించితివాయె
అక్షరార్చన చేతునన్న
పంచాక్షరుడవై యుంటివాయె

శౌర్యాన్ని అర్పింతునన్న
త్రిశూలధారివై యుంటివాయె
నేత్ర నైవేద్యమిత్తునన్న
త్రినేత్రుడవైయుంటివాయె
జంతువుల కాన్కగా ఇత్తునన్న
వాటినే అలంకరించుకొంటివాయె
వైరాగ్యాన్నే ధారపోతునన్న
స్మశానవసంతుడవై యుంటివాయె
లేమినే కలిమిగా అర్పణ చేతునన్న
విభూతి విభుడవై యుంటివాయె
ఏమీయగలనని కనులు మూయుదునన్న
నీవే ధ్యానయోగివై యుంటివాయె
ఏ దిక్కు తోచక
నాదాన్ని నీపరం చేతునన్న
నాదాలు పలికించు ఢమరుక ధారివైయుంటివాయె
చిందులు కనువిందులు చేతునన్న
నటరాజు వైయుంటివాయె
ఎట్లు వేగేదనయ్యా!
శాంత పరుతునన్న
శీతల కిరణధారినీ నీవే ధరించితివి గదయ్యా!
చివరకు ప్రాణాన్నే బలిగా ఇత్తునన్న
శ్రీ కంఠుడవై యుంటివే!

నేను శూన్యుడనయ్యా!
సర్వమూ నీవని
లయకారివైన నీలోనే లయమౌతాను
అద్వైత భావమునౌతాను
శివా! అభవా! మృత్యుంజయా!
సత్యశివసుందరా!

6. హరుడైనా హరియైనా ఒక్కటేరా!

హరుడైనా హరియైనా ఒక్కటేరా!
నిజం తెలుసుకోరా ఓ నరుడా!
నీలోనీకే భేదాలెందుకురా
ఎన్ని గుణాలు ఎన్ని లోపాలు
తనువులో మనసులో
శివుడైనా కేశవుడైనా ఒక్కటేరా!
నీవే శివుడవు నీవే కేశవుడవు
నీ రూపం నీ స్వరూపం తెలుసుకో
నీ రూపంలో బహువిధాలు
నీ గుణంలో పలు రకాలు
బ్రతుకంతా ఒక పక్షం కాంతిమయం
మరో పక్షం అంధకారమయం
రెంటి సమన్వయం బ్రహ్మానందమయం
శివకేశవుల ఏకత్వం

నీ రూపం నీ స్వరూపం

ఏకమేవా ద్వితీయం నీ ఆత్మ స్వరూపం

7. **అద్వైతరూపా! అభయంకరా!**

శ్రీకరా! శ్రీహరా!శివశంభో శంకరా!

అద్వైతరూపా అభయంకరా!

కొలిచిన వారిని కాచెదవు

అభయమిస్తావు సిరులనిస్తావు

పాపముల హరించు హరుడవు

చిన్నపూజలకే భళిరాయంటావు

వరాలిచ్చు బోళాశంకరుడవు

గరళాన్ని మ్రింగిన శ్రీ కంఠుడవు

అమృతాన్ని శ్రీ పతికిచ్చిన శ్రీహరుడవు

చంద్రుని శిరస్సుపై ధరించి వెన్నెల సరస్సునిస్తావు

గంగను జటాజూటాన బంధించి

తాపాలనన్నిటిని హరిస్తావు

జలాభిషేకానికి ప్రసన్నుడవవుతావు

సర్పాన్ని అలంకరించుకొని

దర్పాన్ని అణచి అణకువగా ఉండమంటావు

భస్మాన్ని ధరించి వైరాగ్య విభూతినిస్తావు

గజ చర్మాన్ని ధరించి సాధువులా ఉండమంటావు

త్రినేత్రుడవై త్రిమూర్తివై త్రిశూలివై

త్రికాలాధి పతివై

జ్ఞానదశలో ఉండమంటావు
ధ్యానయోగమే జ్ఞానయోగమంటావు
వెండి కొండ పై ఉండి మాకండగా ఉంటావు
నిను వర్ణింపనాతరమా! నను కరుణింప దిగిరావా!
శ్రీకరా శ్రీహరా శివశంభో శంకరా!
అద్వైతరూపా అభయంకరా!

## 8. వేదైక దేహం శ్రీరామం

| | |
|---|---|
| వేదైకదేహం | శ్రీరామం |
| వైదేహి ప్రాణ వల్లభం | సీతారామం |
| రఘువంశోద్ధారకం | రఘురామం |
| పావననామం | సీతారామం |
| ఆదర్శచరితం | అనఘారామం |
| ధర్మోద్ధరణం | రణకర్కశరామం |
| భువనైకమోహనం | సుందరరామం |
| తాపోపశమనం | ఆ - రామం |
| పాపహరణం | భజశ్రీరామం |
| నయనాభిరామం | మనోభిరామం |
| హనుమద్భావం | సదారామం |
| సూర్యకిరణం | తేజోరామం |
| సర్వజనస్తవం | రాజారామం |
| నిత్యస్మరణీయం | రామనామం |
| జయనామం | జయరామం |
| శ్రీరాం జయరాం | జయజయరాం |

9. రామనామం

రాతిని నాతిని చేసిన పాదము
కిరాతుని మహర్షిని చేసిన పదము
సమభావమెరిగిన శబ్దము
ఏ తీరున మనసారా పిలిచినా పలుకు
ముక్తిదాయకమ్మైన శుభనామం
భక్తుల హృది ఆ-రామం పుష్పించు ఆరామం
కృషికి ఋషికి పరమపదమ్మైనది
రచనకు ఆద్యపాదమ్మైనది
కాలిన్యమెరుగనిది
కరుణా సముద్రమ్మైనది
కాలాని కతీతమ్మైనది
ఏకత్వమే లక్ష్యమ్మైనది
గమ్యాన్ని సూచించు దివ్యపథం
కడుసుందరం పరమపావనం
అమృతమయం
మాతృ హృదయమీరామనామం

10. రామశబ్దామృతము

మరాయను శబ్దమే పలుకు
బోయవానిని
ఆదికవిని చేసి అందించినది
లోకానికి రామాయణ మహాకావ్యము

రామజననమే లోక కళ్యాణ కారకము

జననీ జనకులు గురువులు

పెద్దలు దైవసమానులు

భ్రాతృప్రేమ ఆదర్శము

వశిష్ఠ కౌశిక మహర్షుల ప్రియతమ శిష్యుడు

కాననవాసమే సింహాసన భావముగల

పితృవాక్పాలకుడు

దుష్టుల శిష్టుల పునీతులజేసిన మహనీయుడు

సకల సుగుణాభి రాముడు ఏకపత్నీ వ్రతుడు

మాటకు బాణానికి ఏక లక్ష్యము గలవాడు

సహస్రకోటి లింగార్చకుడు దశకంఠునికి

మోక్షప్రాప్తి కారకుడు

రామరాజ్య పాలకుడు ప్రజాభిరాముడు

సీతారామ దాంపత్యం లోకాదర్శం

రామశబ్దమే మహాశక్తి సంపన్నం

హనుమయని పిలిచినచాలు

రామ దర్శనము తథ్యము

అష్టాక్షరీ పంచాక్షరుల తారకమంత్రము

శివ కేశవుల ఏక భావనము

పాపక్షయ కారకము

జ్ఞానప్రాప్తి హేతువు

ఆత్మజ్ఞానమొసగు సాధనము
మోక్షధామం రామనామం
జీవుని రాముని చేయు
నిరంతర రామస్మరణం

11. రామయ్యా! రావయ్యా! నా ఇంటికి
నేనిటు నీవటు
మరి నాగతి ఏమైనట్టు
రామయ్యా రావా నా ఇంటికి
ఏగతి లేనివాణ్ణి
సద్గతి కోరేవాణ్ణి
ఏమి తెలియని వాణ్ణి
నిన్నే నమ్ముకున్న వాణ్ణి
దూరంగా వున్నావని తెలుసు
దరికి వస్తావని తెలుసు
ఎలా వస్తావో నాకేమి తెలుసు
ఆ దారి నీకే తెలుసు
నీకు నాకు భేధం లేదంటావు
అభేద భావాన్ని దూరంచేయకు
దూరాన్నే బహుదూరం చెయ్యి
నా మనసులోనే నివాసం చెయ్యి
నా ఇంటిని పావనం చెయ్యి

12. రామ చరణం శ్రీరామచరణం

రామ చరణం శ్రీరామ చరణం
అను స్మరణం నీ నామ స్మరణం
సంసార తరణం తరగని ఋణం
రణ మెరుగని శాంత కరణం
తొలగించు మాయా వరణం
పాపహరణం హృదయా భరణం
అందరి శరణం నీ శ్రవణం
కణం కణం ప్రతికణం
నీ నామాను కరణం
క్షణం క్షణం అనుక్షణం
నీ సేవా వీక్షణం
అమల కమలం నీ చరణం
ప్రతి తరుణం నీదు కరుణా వరణం
నీ నామావతరణం మోక్షావతరణం
రామ చరణం శ్రీరామ చరణం
రామ శరణం శ్రీరామ శరణం
చరణ శరణం లోక కళ్యాణం

13. ఏమయ్యా రామయ్యా! ఆత్మారామయ్యా!

ఏమయ్యా రామయ్యా! అంతటా నీవేనయ్యా!
ఇటు రావయ్యా!
ఎచట లేవయ్యా అయినా కానరావేమయ్యా
నీ దాసుడనయ్యా కావగరావయ్యా
ఎంతగా వెదికితినయ్యా
ఎంతగా వేచితినయ్యా
ఇక వేదించకయ్యా
ఇక వేడగలేనయ్యా నిను వీడగలేనయ్యా
దరి రావేమయ్యా రామయ్యా
ఎంతని స్మరింతునయ్యా
అందరి వాడవంటారయ్యా
అందని వాడవైతివేమయ్యా
దర్శన మీయగ రావయ్యా
నీ మార్గమేదో తెలియ కున్నానయ్యా
దీనికంతం తెలియ రాకున్నానయ్యా
అయినా ప్రయత్నం వీడనయ్యా
వేరు ఆలోచన లేదయ్యా
నీవే శరణంటినయా
నీ చరణమే నమ్మితినయా
నీ చరణ కమలమే
నా హృదయ కమలా వాసమయ్యా
పామరుడనయ్యా అమరుడ చేయవయ్యా
రామయ్యా! ఇక వేగరావయ్యా
నా ఆత్మా రామయ్యా

14. కృష్ణయ్యా! నాపాలి దైవమయ్యా!

నా తోడు నా స్నేహం నీవే కృష్ణయ్యా

వేరు నామాలు ఎరుగనయ్యా

సదా నీ నామమే స్మరించెదనయ్యా

నా హృదయమే నీవయ్యా

నీ సహవాసమే నానివాసమయ్యా

నీ సంబంధమే కోరితినయ్యా

ఈ లోకవాసం సహవాసం ఎంతకాలం

సాగేది మరికొంతకాలం

ఆత్మీయత ఎరుగనిదీ సంబంధం

అందుకే

సదా నీతోనే ఉంటాను

నీ స్నేహమే కోరతాను

ఎడబాటు, ఒంటరి తనము ఇక ఉండవయ్యా

నీ నామం నాకు నిత్యం

నీ జత నాలోకం

కృష్ణయ్యా! నీవే నా పాలి దైవమయ్యా!

15. కృష్ణం వందే జగద్గురుం
రేణువునై నీ పాదకమలాల నివసిస్తాను
వేణువునై నీ అధరాల అలంకరిస్తాను
కరుణను చూపిస్తావు
సంపదలు కలిగిస్తావు
ఆపదలు తొలగిస్తావు
ఈ సంపదలు, ఆపదలు అనిత్యం
నీవుకానిదేమీ కోరను
నీనామాన్ని వీడను
నీ సన్నిధియే మహద్భాగ్యం
నీ నామంతో నా హృదయ కమలంలో
నీ పాద కమలాలు నిలుపుకొంటాను
పదార్చన చేస్తాను
రేణువునే చేస్తావో వేణువునే చేస్తావో
కృష్ణా! శ్రీ కృష్ణా!
ఈ అణువు నీకంకితం
కృష్ణం వందే జగద్గురుం

16. సప్త శిఖరవాసా! శ్రీనివాసా!
ఏడు కొండలపై నీవున్నావు క్రింద నేనున్నాను
ఏడడుగులు వేయలేను
నిను చేరగరాలేను

కడు భారమీ పయనం

ఆపై నీ అనుగ్రహం

నిన్నే నమ్ముకొన్నాను

కన్నూ మిన్నూ గానని వాడను కాను

దారి తెన్నూ తెలియనివాడను

ఆకాశరాజు అల్లుడవు సామాన్యుడను నేను

నింగినంటు శిఖరం నీ నిలయం

ఆధారమైన నేల నానివాసం

మాధవునకూ మానవుడే అవసరం

నేను నీకు దాసోహం

నా సర్వస్వం నీకర్పితం

నా జన్మ నీకంకితం

చిన్న చూపు లేక కొండంత దయతో

మోక్ష శిఖరాన్ని అనుగ్రహించు

సప్త శిఖరవాసా! శ్రీనివాసా

17. దయాసాగరా! తిరుమల శ్రీనివాసా!

ఏడు కొండలవాడా ! శ్రీనివాసా !

నా అండ నీవుండ నీకొండ

నే చేరగల స్వామీ

సప్తగిరి వాసుడవు

కొండకొక అడుగున నడిచెద

నీస్మరణతో నీదాసుడనయ్యెదను
ఈ సాహసము నీ ప్రేరణయే స్వామీ!
నిన్ జేరుట కడుభారంబైనను
ఇచ్ఛగించి బయలు దేరితి
నీదేభారమను భావన చేసి సాగింతు
నా యాత్ర నడుమనే ముగిసినా
నీదయగా భావింతు
అయినా నీ ఆశీర్వాదములే
నాకు అడుగడుగునా శ్రీరామ రక్ష
యాత్రనెచట ముగించినా
జన్మను సఫలము జేయుము
పరమార్థతను కలుగజేయుము
దయాసాగరా! తిరుమల శ్రీనివాసా!

## 18. సాయి రావా ! సాయంరావా !

సాయి రావా ! సాయంరావా !
రావా సాయి ! రావా సాయం
నీవున్న మాకేల భయం
నీవేకదా మాకభయం
సాయీ రావా ! సాయంరావా !
ఉదయం లేదు సాయంత్రం లేదు
సదానీ నామ స్మరణం

నీవులేక లేదు నా మానసం
నిన్ను తలవక నిలువదు ఈ కాయం
నిను తలచిన మాత్రాన పరవశించుట ఖాయం
రాయి అంటుంది నా కలం
సాయి సాయి యని
వీడను నీపాదం పాడెద నీ నామం
నా సర్వం నీవే సాయిరాం !
సాయిరాం ! సాయిరాం ! శ్రీ సాయిరాం !

19. సాయి ధామం
సాయి వనంలో విరిసిన పూవులం
వాడని వీడని సుమబాలలం
ఏకల్మషములెరుగని అమాయకులం
దుర్వాసన లెరుగని నీదాసులం
సురభిళాలు వెదజల్లు పరివారం
నీ నామస్మరణమే మాకు తరణోపాయం
నీ పాదయుగమే మహాయోగం
నీ వెన్నెల చూపులే దయాసాగరం
నీ చల్లని నీడలో మాకు లేదు భయం
నీ స్మరణచే నీకు వశులం
నిను గన్న మా సర్వస్వమూ పరవశం
నీ బోధనా వీచికలతో పునీతులం

నీ ధూళియే మామౌళికలంకారం
జరామరణాదులెరుగని భక్తసుమాలం
ఎంత వ్రాసిననా తలచినా తనివి తీరనిది
నామానసం
అందుకే మేము నీకు సదాసేవకులం
నీ ధామం వీడని వారసులం
నీ ధామంలో సదా సుశోభితులం
సాయిరాం ! సాయిరాం !

## 20. సాయి మానసం

సాయి సాయి అంటుంది నామానసం
రాయి రాయి అంటుంది రాయికాని నీనామం
హాయి హాయి ఎంతో హాయి అంటుంది నీరచనం
సాయిరాం సాయిరాం నానివాసం సాయి గ్రామం
ద్వారకామాయి ఎంతో ఆనందదాయకం
సాయి నాథా అంటే తొలగు బాధలు
సాయి ముఖమే శ్రీకరం
కనులు వెన్నెల చిందుగనులు
పాదయుగం గంగానదీ సమానం
నీ హృదయం మాతృ హృదయం
నీ సర్వం ప్రేమమయం

21. సాయి ధ్యానం

సాయి సాయి నే చేసిన నేరమేమి ?
సాయి సాయి సాయం చేయవేమి ?
సదా నిన్నే కొలుతు సదానిన్నే వరింతు
నిన్నెంత పిలిచినా నిన్నెంతగా వేడినా
నిన్నెంత స్మరించినా నిన్నెంతగా పాడినా
ఉలకవు పలకవు కన్పించవేమి ?
నీ పద ధ్యానమే శరణ్యం
నీ పాద సన్నిధే కైవల్యం

22. సాయి నామం అఖండ దీపం

బాబా! బాబా! సాయి బాబా!
మేమందరం నీ బాబులం
నీ ప్రేమకోరు భిక్షుకులం
సిరి సంపదలు కోరని వారం
నీ నామమే అమృత నాదం
బంగారమైనా తృణప్రాయం
నాథా! నాథా! సాయి నాథా!
నీ గాధలు విని తరిస్తున్నాం
మా బాధలు మరుస్తున్నాం
మా హృదయాలే సాయి మందిరాలు
మా నివాసాలే సాయి నిలయాలు

మా సర్వం సాయిమయం

నీవులేక మనలేని వారం

నీ స్మరణే మాకు నిరంతరం

ఈ యాత్ర ముగిసినా బాబా!

నీ అఖండనామం ఆరిపోని అఖండ దీపం

బాబా! బాబా సాయి బాబా

23. బహు సుందర రూపా! సాయి బాబా!

బహు రూపా బాబా! సాయి బాబా!

బహు సుందర రూపా! సుందర బాబా!

బహు అవతారాల రూపం

నీ సుందర రూపం

బహు కోర్కెల తీర్చు నీధామం

బహు భాధలకు ఉపశమనం

బహు బోధలకు నిలయం

బహు వాదనలకు పరిష్కారం

బహు ప్రవచనాల పుస్తకం

బహు తత్త్వాల ఏకత్వం

బహు మతాల సారాంశం

బహు సందేశం నీ సుందర రూపం

బహు రూప స్వరూపా! బహు సుందర రూపా!

సాయి బాబా! సుందర బాబా

24. కలియుగ ప్రత్యక్ష దైవమా !

నిను దరిచేరిన భక్తులం
నీరక్ష కోరువారం
మా పాపాలు లోపాలు తొలగించు
సత్యపథాన నడిపించు
సత్యమేదో అనుగ్రహించు
సత్యరూపులుగా మము మార్చు
కదిలే దైవమా! సత్య రూపమా!
మాలో శక్తిని కదిలించుమా!
నడిచే దైవమా ! నిర్మల రూపమా!
నిర్మల పథాన నడిపించుమా!
పలికే దైవమా! పవిత్ర రూపమా!
సత్యాన్నే పలికించుమా!
నీ దరిజేర్చుకో ఆశ్రిత భక్తవత్సలా!
కలియుగ ప్రత్యక్ష దైవమా!
దేవా! ఓ సాయి దేవా!

25. తొలిచూపు వెన్నెలలో

నను నేను మరిచాను
రాజాధిరాజా! యోగిరాజా! సాయిబాబా!
నను నడిపించు మంచి మార్గాన
వేరే మార్గాలింక వ్యర్థం

నీ మార్గమే నాకు గమ్యం
నీ వీక్షణమే కావాలి తక్షణం
ఆ వెలుగే సదా నా మదిలో మెలుగు
వేరే తలపింకేమి కలుగు
ఆ తొలిచూపే నాకు
మలిగిపోని శాంతినిచ్చు వెలుగు
బాబా! సాయిదేవా! మహాదేవా!

## 26. నీ అమృత రూపం చూపవయ్యా!

మా అనృత రూపం బాపవయ్యా!
నీ అమృత రూపం చూపవయ్యా!
మా రూపమేదో తెలియదు
మా దోషాలేవో తెలియదు
ఏది సత్యమో ఏది అసత్యమో
అసలే తెలియదు
తెలిసింది నిన్ను స్మరించుటే
అది మాసుకృతం
ఈ దేహం ఈ రూపం అనిత్యం
నీ నిత్య నామమే తరణోపాయం
అనృతాన్ని తొలగించు సాధనం
అమృతాన్ని ప్రసాదించు దైవం
నీ రూపమే మాలో నిలిచిన

మేమమృతరూపులం
మేమంతా నీవారము
సర్వం నీ పరివారము

27. ఏది నీ సుందర రూపం ?

ఏది నీ సుందర రూపం ?
చూపవానాకు ముందర నాముందర
చూడాలని నా తొందర
తలచినచాలు పలుకుతావంటారు
అనుగ్రహిస్తావంటారు
నిను తలవక మనలేను
చూడలేక నిలువలేను
నా తహ తహ గ్రహించవయ్యా!
ఇక అనుగ్రహించవయ్యా!
నీ సుందర రూపం చూపవయ్యా!
నాకు తెలుసు నీ నామం నీ రూపం
సమస్తం సుందరం
అందుకే నిలిపాను నా మదిలో
నిశ్చలంగా నీ అఖండ నామం
నీ నామం నీ రూపం అభేదం
నిగ్రహాన్ని ప్రసాదించు
సత్య సుందర రూపాన్ని కటాక్షించు
దేవా! సత్య దేవా! సుందర దేవా!

28. దత్త హృదయం

ఇరువది నాలుగు గడియలకాలం
వెలుగు నీడల పడగల మయం
పగలు రేయిల ద్వంద్వ మయం
ఈ జీవితం
ప్రకృతిని ఆరాధిస్తే గురుబోధ చేస్తుంది.
అది గ్రహించిన హృదయం
దత్తాత్రేయ మందిరం దయాదత్త హృదయం
దత్తమయం జ్యోతిర్మయం
పరమార్థాన్ని బోధించు జ్ఞానపురం
ముక్తి కలిగించు కల్ప వృక్షం

29. శివ మా(న)సం

కార్తికం శివమాసం
సమభావం సమారాధనం దాని సూత్రం
శివారాధన కంకితమైన శివమాసం
గీతకు మాసం ముందుగానే
ఆచార్యత్వాన్ని వహించింది
పరమార్థగీతాన్ని గానం చేసింది
జీవ సంస్కారమే శివారాధనమని బోధించింది
అద్వైతమే తనమతమంటుంది
అక్షర దీప్తుల తోరణాలతో

నిత్య కళ్యాణ శోభలతో
ఆదిత్యుడై వెలుగు పందిరి పరుస్తుంది
వెలుగునింపుకున్న
ప్రతిమాసం శివమాసం
ప్రతిమానసం శివమానసం

## 30. సుందరనాయక స్తుతి

అంజని పుత్రా! పవనతనయా! హనుమా!
నీదుజన్మము రామునికంకితము
చరితము స్తవనీయము
ఎన్నో యోజనాల దూరాన భాసించు
బాల భానుని మధుర ఫలముగా భావించి
ఆరగించిన బాల వీరుడవు
సూర్యుని శిష్యుడవగుటయే దాని ప్రతిఫలం
సకల శాస్త్రకోవిదుడవు
భవసాగరాన్ని అవలీలగా తరించినావు
కపిశ్రేష్ఠుడవై సర్వుల కిష్టుడవై
అర్కసుతుని ముఖ్యుండవైనావు
సుందర నాయకుడవై
జానకీ మాత జాడ తెలిపినావు
రాముని ప్రాణము నిలిపి
అతని ప్రాణమైనావు

రావణ సంహారమున
అడుగడుగునా నీ సాయమందించినావు
రాముని కన్నా రామశబ్దమే మహితమైనదని
తెలుపు నీ పావన చరితము
హనుమయన్న
కాని కార్యమే లేదు ముజ్జగాల
ఆ రాముడే పలుకుతాడు
అంతటి మహా కాయుడవూ
ఒక్క రామనామానికే వశమవుతావు
కలి తారకనామం
సర్వరోగ నివారణం
సకల కలుష హరణం
దగా చేసిన మోదు నీగద
పాపుల పాలిట మహాభీకరమైన
కరవాలము నీ వాలము
నీ కఠిన బ్రహ్మ చర్యమే
ఆశ్రమ వాసులందరికీ ఆదర్శము
రామాయణాన్ని పఠించని వారుండరు
రాముని తలవని వారుండరు
నిన్ను స్మరించని వారూ ఉండరూ
నీవు లేని ఆలయమూ ఉండదు
గ్రామమూ ఉండదూ

ప్రతిజీవి నీస్మరణచే చిరంజీవి!
రామ హనుమలు మమ్ము రక్షించు
నేత్రద్వయం
మీరురువురూ ఒక్కటే!
మధుర రామనామ గాయకా!
రామాయణమే నీవు సుందరనాయకా!

31. ధన్య ప్రసూనం

నీకిష్టమైన దైవాన్ని ఆరాధించు
వేరు దైవాల ద్వేషించకు
వేరు మతాల ప్రతిఘటించకు
దైవమన్నది ఒకటేరూపం
ఏకభావం సమభావం
కావాలి నీ అభిమతం
దైవమేదైన భక్తి ముఖ్యం
ఎల్లలు కల్లలు ఎరుగదు
అనంత ప్రేమ స్వరూపం
భక్తి స్వభావం
గ్రహించిన ప్రతిహృదయం
భక్తిపూరిత హృదయం
భక్త కుసుమం
రచించిన నాకలం
ధన్య ప్రసూనం

# దాతలు

| | | | |
|---|---|---|---|
| 1 | .శ్రీమతి డి. వరలక్ష్మి | - రు. | 211/= |
| 2. | శ్రీమతి శారద | - రు. | 200/= |
| 3. | శ్రీమతి ఎమ్. విజయ కుమారి | - రు. | 50/= |
| 4. | శ్రీమతి ఉషారాణి | - రు. | 50/= |
| 5. | శ్రీ . మడుపు రామచంద్రరావు, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్. | - రు. | 116/= |
| 6. | శ్రీ వి. చలపతిరావు | - రు. | 58/= |
| 7. | శ్రీ వసంతాచారి | - రు. | 111/= |
| 8. | శ్రీ భరతరావు | - రు. | 51/= |
| 9. | శ్రీ కె. లక్ష్మీనారాయణ గుప్త | - రు. | 100/= |
| 10. | శ్రీ ఎస్. అంజయ్య | - రు. | 51/= |
| 11. | శ్రీ కె. శేషాద్రి | - రు. | 51/= |
| 12. | శ్రీ కె. ద్వారకానాథ్ | - రు. | 60/= |
| 13. | శ్రీ పి. కృష్ణమూర్తి | - రు. | 101/= |
| 14. | శ్రీ భానుక జయ నారాయణ | - రు. | 51/= |
| 15. | శ్రీ టి. గంగాధరం | - రు. | 101/= |
| 16. | శ్రీ డి.వి.ఎస్. విజయ కుమార్ & డి. జయరాం | - రు. | 120/= |
| 17. | శ్రీ గంటి లక్ష్మీ నరసింహం | - రు. | 116/= |
| 18. | శ్రీ శ్రీభాష్యం శ్రీనివాసాచార్య | - రు. | 51/= |
| 19. | శ్రీ డా.కె.బి. శ్రీనివాసాచారి | - రు. | 51/= |
| 20. | శ్రీ ఎమ్.వి. సుబ్బారావు | - రు. | 51/= |
| 21. | శ్రీ బులుసు పార్వతీశం | - రు. | 50/= |
| 22. | శ్రీ కె.రాధాకృష్ణ | - రు. | 101/= |




| | | |
|---|---|---|
| పేరు | : | జొన్నలగడ్డ శివరామ కృష్ణప్రసాద్ |
| తల్లిదండ్రులు | : | కీ॥శే॥ పార్వతమ్మ, కీ॥శే॥ విశ్వనాథం |
| పుట్టిన తేది, ఊరు | : | 1950, మచిలీపట్నం. |
| విద్య | : | ఎమ్. ఎస్. సి., వాల్తేరు (ఆంధ్ర విశ్వవిద్యాలయం). |
| వృత్తి | : | సీనియర్ ఆఫీసర్, ఐ.డి.పి.ఎల్. |

ప్రవృత్తియైన అక్షర రచనా వ్యాసంగం ద్వారా అక్షరుని పాదపద్మముల చెంత అక్షర భక్తి ప్రసూనము కావాలని ఈ అక్షర కృషి.